క్రుళ్లుచుఁ గదలుచుఁ గూలుచు నూర్పు, లోల్లనయూర్చుచు నూడుచు రసిక
జిలజిలనెత్తురుఁ జీము గాఱుచును, విలివిలియనఁ జచ్చి విడివి చూపఱకు
నేవ[illegible] దోపంగ నిది యెంత పెద్ద, శైవాపరాధికి సర్వపాపునకు
ఘనశివద్రోహికి ఖలునకుఁ దనకు, ననుచు నంతకుపురి కరిగెఁ జోడండు.
అంత రాజ్యార్థమై యనిఁబోరి యతని, సంతానమెల్ల నిస్సంతానమయ్యెఁ
బాడయ్యె భూమియుఁ బండితవిభుని, యీడిత శాపమహిమ్మతఁ జేసి."

మహిమా. పుట ౨౬౦.

.. .. .. .. ..

కన్నడభాష తనకు రావలయు నన్నకోర్కెతో నీతఁడు కల్యాణమునకు బసవేశ్వరునియొద్దకు వర్తమాన మంపెను. అంత నాతఁడు భస్మము పంపెను. దానిని ధరింపఁగనే పండితునకుఁ గన్నడభాష వచ్చెను. అతఁ డాభాషలోఁ గొన్నిగీతములను చెప్పెను.

.. .. .. .. ..

పానుగంటిరా జైన ఉదయావనీశుని బాధవలనఁ దనశిష్యుఁడు నామయ్య యనువాఁ డురిఁబెట్టుకొని చావఁగాఁ బండితుఁడు కోపగించి రాజునకు శాప మిచ్చి యచ్చటినుండి వెడలెను. తరువాత జరిగిన సమాచారము పండితారాధ్యచరిత్రమునం దిట్లు వ్రాయఁబడి యున్నది:—

"కాదింక నీపానుగంట నుండఁగమ, హాదేవుభక్తుల కనుచుఁ గట్టలుక
మసలక పండితమల్లికార్జునుఁడు, వెసఁ దలిర్పగఁ బురి వెడలంగ వెనుక
నక్కజంబుగఁ బూచె నంత గల్పొన్న, కుక్కురో కుర్రని కూసెఁ గల్కోడి
పురిమహోత్పాతముల్వొట్టె వెండియును, బురముపాడగునని బుధులుగలంగ
విదితశాపోద్ధత విలయోగ్రవహ్ని, కుదయావనీశుఁ డాహుతియయ్యెఁ బుత్ర
పౌత్రు లన్యోన్యకళత్రాభినిరతి, శత్రులై చీఁకటి చప్పరంబులను
దడయ కానురియచేఁ దనపురిజనము, లడరంగనిష్ఠాలమై రట్లు గూడ
సంతానమెల్ల సిస్సంతాన మయ్యె"

మహిమ. పుట ౩౦౧.

.. .. .. .. ..

బసవేశ్వరుఁడు తనకు దర్శనమీయకుండఁగనే మరణము నొందినందు వకుఁ బండితుఁడు మిక్కిలి విలపింపఁగా నాతనిప్రాణలింగమందు బసవేశ్వరుఁ డాతనికిఁ గానిపించె నఁట.

"లింగార్చనంబుఁ జెల్లించుచుఁ జెలఁగి, మంగళారతులెత్తి మహితతదీయ
లింగగర్భమున సల్లీల నొప్పారు, భంగిగా బసవయ్య భావంబు[illegible]ఁవ

కనుఁగవ హర్షకంకణములు దొరుగఁ, దనువున రోమాంచతతులు దలిర్ప
గంధరంబునను గద్గదము నెక్కొనఁగ, బంధురానందవిభ్రాంతిఁ బండితుఁడు [సు
కనువిచ్చి చూచుచుఁ గరముద్ధి మ్రొక్కుచు, నుభజించుచు నభిస్తుతులు సేయుచు
ఈమూర్తి యస్మదీ యేష్టలింగము మ, హామూర్తి యైన వృషాధీశమూర్తి"

శ్రీశైలమువైపు వెళ్లి పర్వతము క్రిందనున్న వెల్లటూరిలో నివాసముగా నుండి శిష్యుఁడైన దోనయ్యను గిరిప్రదక్షిణము చేయఁ బంపెను. ఆతఁడు కొంతదూరము పర్వతయాత్ర చేసిన తరువాత నాతనికిఁ గలలో శివుఁ డొక ముసలిజంగమువేషమునఁ గాన్పించి, యొకచె ట్టెక్కించి శ్రీశైలపర్వతము మీఁద నున్నట్టియుఁ జుట్టు నున్నట్టియు క్షేత్రము లన్నియుఁ జూపి చెప్పి నీకు శ్రీగిరిప్రదక్షిణఫలము వచ్చిన దని యనుగ్రహించెను. శైవమతమునకు గురు వైన పండితారాధ్యుఁడు తనకుఁ జిన్ననాఁటిస్నేహితుఁ డనియు నతనికి యాత్రా ఫలము సిద్ధించిన దని చెప్పవలసిన దనియు దోనయ్యతోఁ జెప్పెను. అంత దోనయ్య పర్వతము దిగి వెల్లటూరునకు వచ్చి పండితునితో నీసంగతి చెప్పఁగా నాతఁడు సంతోషించెను. శ్రీపర్వతము శివలింగమయముగాన వెళ్లినయెడలఁ గాళ్లతో లింగములఁ దన్నినట్లగును; వెళ్లకున్న మల్లికార్జునుని జూచుట తటస్థింప దు. అని తలఁచి తనను శివలోకమునకుఁ దీసికొని పొమ్మని శివుని బ్రార్థించెను. అంత శివలింగ మాతని నాతని భార్యాపుత్రులను దనలోఁ గలుపుకొనెను.

తెనుఁగుదేశమందు బుద్ధపూజ.

పండితారాధ్యచరిత్రయందు వెలనాటి చోడుఁడును చందవోలుకైఫీయతులోఁ గొండపడమటి బుద్ధరాజును బౌద్ధగురువుల శిష్యులనియుఁ దమగురువుల ప్రోత్సాహమువలన వారు శైవుఁడైన పండితారాధ్యుని కనులు తీయించి రనియుఁ జెప్పఁబడియున్నది. కాని, యీరాజులచే నీయఁబడిన శాసనము లన్నియు, దొరకినంతవఱకు శివకేశవుల కీయఁబడిన దానములుగ నున్నవే కాని బుద్ధున కిచ్చినవిగా లేవు. తనకుఁ బూర్వు లయిన వెలనాటిరాజు లందఱును శైవులుగ నుండిరనియు, దానుమాత్రము బౌద్ధమతము నంగీకరించితి ననియుఁ, జరమదశలోఁ జెప్పి చోడుఁడు చింతించినట్లు పండితారాధ్యచరిత్రలో నున్నది.

"ధరణీశ్వరుఁడు తమతరతరంబునను, హరుని భక్తుల కాని యన్యులు లేరు
కనియు వినియు నెఱుఁగని బౌద్ధమతము, దనకుఁ బ్రాప్తంబయ్యె ధర్మేతరంబు

వేదబాహ్యము ముక్తివిముఖంబు శూన్య, వాదం బగును బౌద్ధవాదం బనంగ
పాపంబు దుర్బోధ పాలైతి నింక. [మహిమా. పుట. ౭౯.

ఇట్లు వెలనాటిచోడుండు గాని యాతనిబావమఱంది యగుబుద్ధరాజు గాని బౌద్ధమతావలంబు లనుటకుఁ బండితారాధ్యచరిత్రయుఁ గ్రైఫీయతునుదప్ప మఱి యేయాధారము లేకపోయినను, నాకాలమందును నంతకుఁ బూర్వకాలమందును, కొంతవఱకుఁ దరువాతికాలమందును, తెలుఁగుదేశమునను విశేషముగ గుంటూరుప్రాంతమునను చందవోలువైపునను బుద్ధునిపూజ యుండెనని శాసనాదులవలన స్పష్టముగఁ దెలియుచున్నది. పూర్వకాలమందు బుద్ధుని పూజ యున్నందునకు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోని అమరావతీ స్తూపమును, చందవోలుకు ౧౪-౧౫ మైళ్లదూరమున నున్న భట్టిప్రోలుస్తూపమును సాక్ష్యములు. చందవోలుభూమిలో జైనబౌద్ధుల రాగిప్రతిమలు పెక్కులు దొరకినవి.*

పండితుని కాలమునందు నాప్రాంతమున బుద్ధోపాసన కల దనుటకుఁ గొన్ని దృష్టాంతములు కలవు. బెజవాడ మల్లేశ్వరదేవాలయమునందు శా. శ. ౧౦౬౯ (క్రి.శ. ౧౧౪౭) నాఁటిశాసన మొకటి కలదు. అది మహామాండలిక భీమన అనురాజుయొక్క సంధివిగ్రహి (మంత్రి) యైన సోమనప్రెగ్గడచే వేయఁ బడినది.† ఈతఁడు "ఆంధ్రధరణి పంచారామముల మహాదేవరలకు బుద్ధదేవరకును ౧ జేబ్రోలు సహస్రాసీనునకు నుం బినపురము హుంకారశంకరికిఁ గరము మాఘికెక్కిన బెజవాడమల్లేశ్వరదేవరకు నఖండదీపములు" పెట్టించెను. అమరావతిలోఁ గోటకేతరాజు శాసన మొకటి కలదు.‡ అది శా. శ. ౧౧౦౪. క్రి. శ. (౧౧౮౨-౩) నాఁటిది. ఇందు మూలమున నారాజు బుద్ధదేవునకుఁ గొన్నిగ్రామ

* Chandavolu— ... Close by it were found buried a number of Budhist or Jain copper images now in the library at Bezwada.
Sewell's Antiquities Vol. I, App. p. iii.

† Ep. R. 295 of 1892.

‡ Ep. Ind. Vol. VI, p. 152 &c. "శ్రీమహామండలేశ్వర కోటకేతరాజులు శకవర్షములు ౧౧౦౪ గు నేంటిమాఘశుద్ధ ౧౦ గురువారమున శ్రీబుద్ధదేవరకు సుంకములోనుగా సర్వాయములతో నాచంద్రార్కముగా నిచ్చిన ఊద్ధుకంప్రుడిలోని క్రంతేరు కొంపపడమటి లోని మేడుకొండసూరు దొంకపట్టును. ఈస్థలము సమపనివారు పంచమహాపాతకములు చేసినవారు . . . కోటకేతరాజులు . . . దమకు ధర్మార్థముగా శ్రీబుద్ధదేవరకు నఖండదీపంబులు రెంటికినై ఇచ్చిన ఇన్నఎడ్లు ౧౧౦ . . . శ్రీమత్కోటనృప స్సమస్తగురవే గ్రామాన్వరేణ్యా న్బహూన్ సంప్రాదా త్సుగతేశ్వరాయ విపులు శ్రీధర్మసంవృద్ధయే."

ములు మొదలయినవి యిచ్చెను. ఇతనియుంపుడుకత్తెలును బుద్ధదేవర దేవారాధనకై కొన్ని గొఱియల నొసంగిరి యని తెలియవచ్చుచున్నది.

తరువాతఁగూడ బుద్ధునిఁ దెనుఁగువారు కొంతకాలమువఱకుఁ బూజించుచుండి రనుట శా. శ. ౧౧౫౬ (క్రీ. శ. ౧౨౩౪) లోని బయ్యాంబ శాసనము వలనఁ దెలియుచున్నది.*

ఇట్లు పండితునికాలమునఁ దెనుఁగుదేశమందు బౌద్ధమతము కొంతవఱకుండె నని చెప్పవచ్చును. అది దానియంత్యదశ యనుటకు సంశయము లేదు. కాని యప్పటికి దానికిని హిందూమతమునకును ప్రబల వైర ముడిగి యవి యిప్పటిశైవవైష్ణవమతములవలె నుండె నని, యొక్కరాజే శివునకు, విష్ణువునకు, బుద్ధునకు, మఱియితరదేవతలకు దానముచేయుటఁ బట్టి యూహింపవచ్చును. కృష్ణదేవరాయాదులవలె, నిప్పటి పెక్కురాజులవలెను, దామొక సంప్రదాయపువారైనను, అనఁగాఁ దమగురువులొకమతమువారైనను, రాజులు సాధారణముగ నన్నిదేవతలకును దానధర్మము లిచ్చుచుండిరి. అట్టిదేవతలలో బుద్ధుఁడుకూడఁ బూజింపఁదగినదేవతగ నెంచఁబడుచుండెను.

ఇప్పటి స్మార్తులకు సాధారణముగ శివకేశవులు సమానులయినను, ఒకప్పుడు కొందఱకు నప్పయ్యదీక్షితులవలె శివునియందును, కొందఱకుఁ బోతనవలె విష్ణువునందును భక్తియధికమైనట్లు లప్పుడొకానొక రాజునకు బుద్ధునియందు భక్తి యెక్కుడు కల్గియుండిన నుండవచ్చును. అట్టివానికి గురువుల ప్రేరణచే మతోద్రేకము కలిగ యన్యమతద్వేషము కల్గుట వింతకాదు. అట్లె వెలనాటిచోడునకుఁగాని యతనిబావమఱఁదియైన బుద్ధరాజునకుఁ గాని యాకాలమందు బౌద్ధమతమునందు నెక్కుడు విశ్వాసము కలిగి, బౌద్ధగురువుల ప్రేరణచే వారు పండితుని నగౌరవించుటకు యత్నించియుండిన నుండవచ్చును.

చోడుని బావమఱఁదియైన బుద్ధరాజు నామమువలననే వీరివంశమునందు బుద్ధభక్తి యెక్కుడుగా నుండె నని మన మూహింపవచ్చును. చందవోలునకు సమీపమున బుద్ధవాడ యనుగ్రామము కలదఁట. అది పూర్వము బౌద్ధుల నివాసస్థానమఁట.

ఈగ్రంథమందలి మతవిషయములు.

ఆంధ్రదేశమందలి బ్రాహ్మణులలో నారాధ్యు లన్న యొకతెగ గలదు. వీరు లింగమును ధరించెదరు. ఇట్లు బ్రాహ్మణులలో లింగధారణ చేసికొను

* Ep. Ind. Vol. VI p. 157.

నాచారము తెలుఁగుదేశమునందుఁ దప్ప మఱియెచ్చటను లేదు.* అఱవ దేశమునందు బ్రాహ్మణులలో స్మార్తులనే శైవులందురు. అచ్చట బ్రాహ్మణేతరు లలో వీరశైవులు పెక్కుగు గలరు. పెక్కుమఠములును, పండారములను, గురువులును గలరు. కాని, వీరు శివాధిక్యతను బోధింతురే కాని, లింగము కట్టుకొనరు. కర్ణాటదేశమునందు బ్రాహ్మణేతరులందు మాత్రము లింగధారులు గలరు. వారిని లింగాయతు లనియెదరు. వీరిది బసవసంప్రదాయము. తెలుఁగు దేశమందలి యారాధ్యులది పండితసంప్రదాయ మనిపించుకొనును. ఈరెండు సంప్రదాయములకును భేద మేమియన నారాధ్యులు శ్రుతిస్మృతులందుఁ బ్రమాణభావము కలవారలై, గృహ్యసంస్కారములను వేదోక్తముగ జరుపుకొనియెదరు. ఒక్కయంత్యసంస్కారమును, ప్రతిసంవత్సరము శ్రాద్ధమును నాగమోక్తముగ జరిపెదరు. జాతినిబాటించెదరు. లింగాయతులు వేదాదికములను మన్నింపరు. భక్తియె వారికిఁ బ్రధానము. తెనుఁగుదేశమందలి జంగము లిట్టివారు.

జందెముతీసి, జాతివిడిచి, తనలోవచ్చి కలియవలసినదిగా బసవేశ్వరుఁడు మల్లికార్జునపండితుని గోరినట్లును, నాతఁడు "భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ"యనిప్రత్యుత్తరము పంపినట్లును జెప్పెదరు. ఈతనిచే నేర్పాటుచేయఁబడిన యాచారములనే యారాధ్యు లనుసరించుచున్నా రని యీసంప్రదాయమువారి యభిప్రాయము.

ఈగ్రంథమునందు శివాధిక్యతను గుఱించి యెక్కువగఁ జెప్పఁబడినను, లింగధారణను గుఱించి యెంతమాత్రముఁ జెప్పఁబడి యుండకపోవుట యాశ్చర్యము! ౨౨౮ మొదలు ౨౩౦ వఱకు శివదీక్షను గుఱించి చెప్పఁబడియున్నది, గాని, యదియె లింగధారణదీక్ష యని కవియొక్క యభిప్రాయ మేమో తెలియదు.

౨౧ మొదలు ౩౦ వఱకు 'పశుపాశుపతి' వివేకము చెప్పఁబడినది. ఇదియె పాశుపతశైవసంప్రదాయముయొక్క ముఖ్యసిద్ధాంతము.

౩౧ మొదలు ౬౬ వఱకు నద్వైతులమాయావాదము యుక్తులచే ఖండింపఁబడినది. మాయావాదమును ఖండించుటకై రామానుజకృత శ్రీభాష్యమందును జెప్పఁబడిన, యనిర్వచనీయానుపపత్తి మొదలయినయుక్తులు

* కర్ణాటదేశమునందుఁ గూడ నారాధ్యులు గలరు. కాని వారు పూర్వము తెనుఁగుదేశమునుండి పోయినవారుగనే కానవచ్చుచున్నారు.

కొద్దిలోఁ బండితునిచే నీపద్యములందుఁ జూపఁబడినవి. ఇందువలన నీతఁడు భాష్యాదికములను జక్కఁగఁ జదివినపండితుఁ డని స్పష్టపడుచున్నది.

మాయావాదఖండనమునందు నీతఁడు విశిష్టాద్వైతులతో నేకీభవించినను, ఇతరవిషయములలోఁ గేవలద్వైతి. ఇతనిమతమునఁ బ్రపంచము సత్యము, నాత్మకంటె భిన్నము. జీవాత్మపరమాత్మ లొక్కటి కాదు. శివునకు జీవునకుఁ బర్వతపరమాణుభేదము కలదు. భక్తితో నీశ్వరుని సేవించినఁ గాని ముక్తి లేదు. కేవలజ్ఞానమువలన ముక్తిలేదు.

కేవలయుక్తులచేఁ దనమతమును స్థాపించుటకు యత్నించినను, వేదప్రమాణమును గూడ విడువలేదు. వేదవాక్యములు కేవల ద్వైతమునే బోధించు నని ప్రతిపాదించియున్నాఁడు (౫౩) ఇంతియ కాదు. అద్వైతపరములుగాఁ గానవచ్చెడు వాక్యములకు ద్వైతపరముగ నర్థము చెప్ప యత్నించెను. 'అద్వైతపరములుగాఁ గానవచ్చెడి వాక్యము లీశ్వరుని యైశ్వర్యాద్వైతమును బోధించునేగాని, జీవశివాద్వైతమును బోధింపవు; అట్లర్థముచేయుట తప్పు. (౬౨) సర్వము శివుఁ డనఁగా, సృష్టియందలి యన్నియు నతని యధీనమని యర్థము. (౬౩)' అని యీతఁడు వాదించియున్నాఁడు. 'తత్త్వమసి' యను వాక్యమునకు మధ్వమతస్థులు 'తస్యత్వమసి' యని యర్థము చేయుట మన మెఱుఁగుదుము. పండితుఁ డీయర్థమునే యీక్రిందిపద్యమునందుఁ జెప్పెను:—*

క. జీవుఁడు శివుఁ డనువాక్యము, భావింపఁగ నైక్యమునకుఁ బ్రతిపాదకమే
జీవుం డనఁ బశుభృత్యుఁడు, గావున నీవాఁడ వేఱు గా దనుట శివా. ౪౦

కావున, నీలకంఠశివాచార్యులవారు విశిష్టాద్వైతి యైనను బండితుఁడు మాత్రము ద్వైతి యనియే చెప్పవలయును.

ఈగ్రంథమునందు శివభక్తిమహిమ యెక్కువగఁ జెప్పఁబడి యున్నను, నిందుఁ గొన్నివిశేషములు గలవు. భర్త శివభక్తుఁడు కానియెడల భార్య వానిని విడిచి వేయవలయును; దోషము లేదు (౨౩౧-౩౩) అనసూయ నాలాయని యనుమునిపత్ను లిట్టు చేసి శివునిచే వరములు వడసిరి. (౨౩౪) శివనింద చేయు

* మల్లికార్జునుఁడు ౧౨-వ శతాబ్దమువాఁడు. మధ్వరాయఁడు ౧౩-వ శతాబ్దమువాఁడు కావున, 'తత్త్వమసి' యను వాక్యమునకు 'తస్యత్వమసి' (వానివాఁడవు) అని యర్థముచేయుట మధ్వరాయలే పండితునియొద్దినుండి యో, యీమతమువారినుండి యో గ్రహించియుండును. మధ్వరాయ లనఁబడు నానందతీర్థుల కాలముకొఱకుఁ జూడుఁడి Dr. Bhandarkur's Vaishnavism &c. p. 50,

గ్రంథములఁ గాల్పవలయును. తద్గ్రంథకర్తలఁ జంపవలయును. శివనిందకుని జంపినను, నాప్రయత్నమందుఁ జచ్చినను ముక్తివచ్చును. (౨౮౭-౨౯౦.)

ఇట్లు శివనిందకులఁ జంపవచ్చునని యీగ్రంథమునందుఁ జెప్పినను, బసవపురాణమునందుఁ గొందఱు భక్తులు భవులను జంపి రన్నకథ లున్నను దమవారి వీరశైవు లిట్టియమానుషకృత్యముల నొప్పినవారు కారు. కర్ణాటదేశమందలి యబ్రాహ్మణు లగులింగాయతు లేమిఁ దెలుఁగుదేశమందలి బ్రాహ్మణు లగునారాధ్యు లేమి ప్రభుత్వమువారిచే మిక్కిలి శాంతప్రియు లయినవారుగ నెంచఁబడుచున్నారు. కావున నీబోధ నుత్తరకాలీను లైనశైవు లంగీకరింప లే దని యే చెప్పవలయును.

శివునికొఱకు మృతినొందువానికి దినవారములు మొదలయిన ప్రేతక్రియలు చేయఁగూడదు. వానిపుత్రాదులకు సూతకము లేదు.* వాని చావు నకై యందఱును బందుగ చేసికొనవలసినది. (౨౯౧-౨౯౩.)

౨౯౪-వ పద్యము మొదలు ౨౨౨-వ పద్యమువఱకు శివనిర్మాల్యము భుజింపవచ్చుననియు, దానిని శివదీక్షితుఁడు తప్ప నితరులు భుజింపఁగూడదనియుఁ జెప్పఁబడియున్నది. ఇతరశైవగ్రంథములలోఁ గూడ నిందునుగుఱించి విశేషముగఁ జర్చ యుండును. ఇందుకుఁ గారణ మేమనఁగా శివుని నైవేద్యము నిర్మాల్య మనియు, భుజింపఁగూడ దనియు స్మార్తుల యభిప్రాయము. అందుచే వారు శివాలయములలోని కొబ్బరి మొదలయిన ప్రసాదముఁగూడ భక్షింపరు. ఇట్లు శివునకు నైవేద్యము చేసినవస్తువు సన్న్యాలు భక్షింపఁగూడ దన్న యూహ జనులకుఁ గల్గినది. దానిని ఖండనచేయుటకును, శివునకు నర్పింపనిది యేవస్తువును భక్షింపఁగూడ దని స్థాపించుటకును నీప్రకరణము వ్రాయఁబడినది. లింగధారులు లింగమునకు నైవేద్యము పెట్టనిది యేవస్తువు భుజింపరు. తుదకు మందుఁగూడ నైవేద్యము పెట్టి భుజింతురు. కొందఱ కిం కొకనియము కలదు. ఒక్కసారే కావలసినభోజనపదార్థములు వడ్డించుకొనియెదరు. రెండవసారి వడ్డించుకొనరు. నైవేద్యము పెట్టినపదార్థ మంతయు భుజింపవలయును. శివునకు నైవేద్య మైనపదార్థము లింగధారులు దప్ప యితరులు భుజింపరాదు. ఈయాచారముల కన్నింటికిని బైని చూపిన పద్యములలోని బోధయే మూలాధారము.

---

*ఆరాధ్యులలో నిప్పటికి నొకవిధముగ సూతకమును బాటింపరనియే చెప్పవచ్చును. వారు సూతకదినములలో నితరులనుండి విడిగానున్నను, ఆదినములలో సంధ్యావందన శివపూజాదికమును మానరు. ఎప్పటివలెనే చేసికొనియెదరు. స్త్రీలును రజస్వలలైన దినములలోను, బురిటిలోను శివపూజను జేసికొనియెదరు. ఇట్లేల యనియడుగ, యజ్ఞదీక్షితునకు నాశౌచమువచ్చిన యెడలఁ గర్మ విడువఁడు. అట్లే చేయవలయునని చెప్పెదరు.

### భాషావిశేషములు.

ఈకావ్యము తెలుఁగువ్యాకరణము నతిక్రమింపక పూర్వకవిమార్గము నే యనుసరించి సలక్షణముగ వ్రాయఁబడిన దని చెప్పవచ్చును. ఈకవికిఁ బూర్వపు వాఁ డని నిశ్చయముగఁ జెప్పుటకు వీలయినవాఁడు నన్నయయే. నన్నయ కావ్యమందలి లక్షణమును శబ్దజాలమును నీశతకమునందుఁ గానవచ్చుచున్నవి. అందువలన నాసంప్రదాయము పరంపరగా నీతనికాలమువఱకు వచ్చెనని మన మూహింపవచ్చును.

### స్వల్పవిశేషములు.

ఇట్లు మొత్తముమీఁదఁ బూర్వపద్ధతి నవలంబించినను నన్నయగ్రంథము నందుఁగాని తరువాతివా రగుతిక్కనాదుల గ్రంథములలోఁగాని గానరాని భాషా విశేషములు కొన్ని యిందుఁ గానవచ్చుచున్నవి.

'అనాఁడు' అనుటకు 'అన్నఁడు' (౨౬౯), 'మలహానుఁడు' అనుటకు 'మలహా', (౪౧౫), అను మాఱురూపములు కానవచ్చుచున్నవి. పానలు (౪౬), బడరుఁడు (౨౬౦), పొసపోరు (౪౩౧-౨) అనుక్రొత్తశబ్దము లున్నవి. ఇందు 'పానలు' అనునది పాలకురికి సోమనాథుని గ్రంథములందును, ఇతర శైవగ్రంథములందును గానవచ్చును. 'బడరుఁడు' నన్నెచోడుని కుమారసంభవమం దున్నది. మూఁడవది పాలకురికి సోమనాథుని గ్రంథమునందుఁ గొంచెము మాఱురూపముతో నున్నది. ఈశబ్దముల యర్థములను గుఱించి లఘుటీకఁ జూడనగును. మొత్తముమీఁద నీశబ్దములను శైవగ్రంథకర్తలే విశేషముగ వాడుచున్నట్టు కనఁబడుచున్నది. ఇంకను జిన్న విశేషములు లఘుటీకలోఁ జూడ నగును.

### ప్రాసవిశేషములు.

మనపూర్వలాక్షణికు లెవ్వరును జెప్పనట్టిదియుఁ గర్ణాటభాషలో నొప్పు కొనఁబడినదియు మనపూర్వకావ్యములలో నరుదుగఁ గానవచ్చునదియు నగు నొకప్రాస మిందుఁ గానవచ్చుచున్నది. దీనిని 'వలపలగిలుకప్రాస' మనవచ్చును. ఒకసంయుక్తాక్షరమునందు మొదటిహల్లు రేఫగా నుండి రెండవది మఱియొక హల్లుగా నున్నప్పుడు నట్టిసంయుక్తాక్షరమునకును రేఫలేని రెండవయక్షరము నకును బ్రాసమైత్రి చెల్లును. ౩౧౭-వ పద్యముఁ జూడుఁడు. ఇందు, కర్మ, నిర్మాత, తమ్ములు, ఇమ్ములు అనుపదములలోని ద్వితీయాక్షరములు ప్రాసస్థానమునం దున్నవి. ౩౨౦-వ ౪౪౪-వ పద్యములలోను నిట్టిప్రాసమే కలదు. ఇది కర్ణాట సంప్రదాయము. ఇట్టిది యాంధ్రగ్రంథములలో గలదా యని విచారింపఁగా నీక్రిందిప్రయోగములు కానవచ్చినవి:—

1. క. ద్యూతక్రీడకుఁ గొండొక, నేతుఁగం గపటమున నోర్వనిజనంబులు నా
చేతిధన మెల్లఁ గొని పరి, భూతిఁయొనర్చినవిరక్తిపుట్టి వెడలితిఁ.

తిక్కన విరాట. ౧-౧౯౫.

2. ద్వి. బిజ్జలునకు వినిపింపఁగ నతఁడు, కజ్జఱ్ మెంతేనియుఁ గలదు పోరాదు.

పా. సోమనాథుఁడు, బసవపురాణము పొడ్డలదేవుకథ.

3. భగుఱ్ం డంతకవాహినుల్ శరహతిఱ్ భంజించున ట్లిమ్మెయిఱ్
తగఱ్ంగా రథపత్త్రముల్ విఱిగి వేదండాంకురానీకముల్
నుగ్గాడం భటకోరకంబు లలరఱ్ నూత్నాశ్వపుష్పౌఘముల్
మ్రగ్గింతుఱ్ బరసైన్యపద్మవనముఱ్ మద్బాణవఱ్షంబునన్.

నన్నెచోడ కుమారసంభవము ౧౧-3౮.

4. క. ఎప్పుడుఁ దప్పులు వెదకెడు, నప్పురుషుని గొల్వఁగూడ దదియెట్లనినఱ్
సర్పంబు పడగనీడను, గప్ప వసించినవిధంబు గదరాసుమతీ.

సుమతిశతకము.

ఈ 'వలపలగిలుక ప్రాసము' ఇటీవలి లాక్షణికు లొప్పినది కాదు. కావున మూలగ్రంథములలోఁ బైని చూపినట్లు పాఠమున్నను, దాటాకులపై వ్రాయు లేఖకులును నిటీవలి పండితులును వానిని దిద్ది, నేతుఱ్ (నెత్తుఱ్ అను నర్థ మందు), కజ్జము (కర్జమను నర్థమందు,) నుగ్గాడఁ (నుగ్గుచేయు నను నర్థమందు), మర్గింతుఱ్ (మ్రగ్గింతున్ అను నర్థమందు), సప్పము (సర్పమను నర్థమందు), అనునూతనశబ్దములుగ మార్చి, యివి మహాకవిప్రయోగములు గనుక నీరూప ములే సాధువు లని వాదించుచున్నారు. కాని యీశబ్దముల యీవిపరీతరూప ముల నంగీకరించుటకంటె వీనికన్నిఁటికిని సమానమైన వలపలగిలుక ప్రాస మాకవుల కిష్టమని తలఁచుట లాఘవము గదా? భాషలో నాయా యొక్కొక తావునఁ దప్ప నీవిపరీతరూపములకు మఱియెచ్చటను బ్రయోగము కానరాదు. 'నేతుఱ్' అని విరాటపర్వమునందుఁ దప్ప భాషలో మఱియెచ్చటను గాన రాదు. 'సప్ప' మని ప్రాకృతరూపము కలదుగాని యది తెనుఁగులోనికి రాలేదు. సుమతిశతకమునందుఁ దప్ప సప్ప మెచ్చట నగపడదు. ఇట్లే యితరశబ్దములను గుఱించియుఁ దెలిసికొనవలసినది. కావున నీశబ్దములవింత రూపము లాయా కవులకు సమ్మతము లని యనుకొనుటకంటెఁ బూర్వకవులకు నీకర్ణాటసంప్ర దాయ మిష్టమనియే యెంచుట మంచిది. కాని చెవులకు నింపుగ లేనందునఁ గ్రమముగఁ ద్యజింపఁబడి యుండవచ్చును.

### పండితమతము.

సంస్కృతపండితారాధ్యచరిత్రమును గర్ణాటభాషాంతరముతో మైసూరు నందుఁ బ్రకటించిన శ్రీయుత కఱిబసవశాస్త్రిగారు పీఠికలో నిప్పుడు గుత్తిలో నున్న జంగమమఠమే పరంపరాగత మైనమల్లికార్జునపండితారాధ్యుని మఠ మనియు, దానిని భిక్షావృత్తిమఠ మని కూడ ననియెద రనియు వ్రాసియున్నారు. కాని వా రందుకు నేమియు నాధారములు చూపియుండలేదు.

పండితారాధ్యుని మతము జంగమమత మెప్పటికిని గానేర దని నాతాత్పర్యము. ఏలయన మల్లికార్జునుఁడు బ్రాహ్మణత్వము వదలినవాఁడును గాఁడు, సన్న్యాసము పుచ్చుకొనినవాఁడును గాఁడు. జంగమమతమునకు నీరెండును నవశ్యకములు. పండితుని శివతత్త్వసారమువలన నాతనికి వేదప్రామాణ్యము నందు దృఢవిశ్వాసము కల దనియు, బ్రాహ్మణులయెడ భక్తి గల దనియు స్పష్టపడఁగలదు. ఈగ్రంథమందలి ౧౭, ౧౯, ౨౦, ౨౭, ౩౨, ౩౩, ౪౩, ౪౮, ౬౨, ౬౩, ౬౪, ౭౩, ౧౦౦, ౧౦౧, ౧౧౮-వ సంఖ్యలు గలపద్యములఁ జూడనగును. "భక్తిమీఁదివలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుఁ బాయలేను నేను బసవలింగ" యన్నయర్థ మీశతకమునందుఁ బాగుగఁ గనఁబడుచున్నది. కవి శివభక్తిమహిమయు వర్ణించియున్నాఁడు, వేదముల ప్రామాణ్యము నంగీకరించి యున్నాఁడు. ఇఁక నీతండు లింగైక్యముఁ జెందువఱకును గృహస్థుఁడుగ నుండెనే గాని సన్న్యాసి కాఁ డనినవిషయము పండితారాధ్యచరిత్రమువలననే స్పష్టము. ఈతఁడు వెల్లటూరిలో భార్యాపుత్రులతోఁ గూడ శివునిలింగమునందుఁ బ్రవేశించె నని పండితారాధ్యచరిత్రము నందున్నది. కావున నీతఁడు చివరవఱకు గృహస్థధర్మమునే యనుసరించుచుండె ననుట స్పష్టము. ఇంతియకాదీతనికి జుట్టు జందెము తీసి సన్న్యాసియగుట కిష్టము లేకయుండె నని ౪౮-వ పద్యమువలన స్పష్టము. అందు సన్న్యాసులను 'గతశిఖాగాయత్రియజ్ఞోపవీత నాస్తికులు' అని నిందించియున్నాఁడు.

ఇదియుఁగాక, ౧౫ాతనితరువాత నీతనిమతము వ్యాప్తిచేసిన వారిది గృహస్థపీఠమే గాని సన్న్యాసపీఠము కా దనియు, నాపీఠస్థులు పండితునికుమారుఁడైన కేదారయ్యయొక్కయు, శిష్యుఁడైన దోనయ్యయొక్కయు సంతతివారనియు స్పష్టముగఁ జెప్పఁబడియున్నది. కావున భిక్షావృత్తిమత మనఁబడు జంగమమతమునకును బండితమతమునకును సంబంధము లేనట్లు స్పష్టపడుచున్నది.

శ్రీశైలముమీఁద ౧౪-వశతాబ్దమునందు భిక్షావృత్తిమత మొకటి యుండెనని శాసనములవలనను శ్రీనాథుని శివరాత్రిమాహాత్మ్యము వలనను మన మెఱుఁగుదుము. శ్రీనాథుఁడు తనగ్రంథమును భిక్షావృత్తియతీంద్రుని యనుజ్ఞ ననుసరించి యతనిశిష్యునికంకితముగ వ్రాసెను. ఈకవియే పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగ రచించె నన్నమాట మనము మఱచిపోరాదు. కావునఁ బండితారాధ్యులకును భిక్షావృత్తిమతమునకును నేవిధమైన సంబంధ మున్నను శ్రీనాథుఁడు తనశివరాత్రిమాహాత్మ్యమునందుఁ జెప్పియుండును. అట్లాతఁడు చెప్పియుండ లేదు.

కొ॥ వేం॥ లక్ష్మణరావు.

౧౬౮. "బత్తళి" యనుకర్ణాటశబ్దము లేకుండ నీపద్యము నిట్లు దిద్దవచ్చును. క. తత్త్వ స్థాది[సమస్త]వి । పత్తులు జలతపన[శీత]బాధాది. ఇత్యాది.

౧౮౮. పుచ్చిన - పెఱికిన.

౧౯౪. శ్వపచునకుఁ గీడు=శ్వపచునకుఁ గ్రిందివాఁడు, మాలవానికంటెఁ దక్కువవాఁడు.

౧౯౫. పలమెత్తు ప్రత్తికిఁ గుల మంతయు నమ్ముడుపోయినకథ యేశైవపురాణమం దైనను గలదేమో. పెరియపురాణములో - నొక భక్తుని కౌపీనముతో రాజు నైశ్వర్యమును గుటుంబమును సరితూఁగలేకపోయె నని కథ కలదు. దీనికి దాని కేమైన సంబంధము గలదా.

౧౯౬. ప్రువ్వులు = పురుగులు.

౧౯౭. కొన్నిటినాళ్లల్ - కొన్నినాళ్లు మట్టుకు. స్వల్పకాలమువఱకే యని భావము. మెర యలక్రియ "మెఱియలక్రియ" నని దిద్దుకొనవలయును. మెఱియ యనఁగా గుంత్రాయి. దినవారములు చేయునపు డొక ఱాతియందుఁ బ్రేతనారోపించి దానిమీఁద నీళ్లు పోసి నువ్వులు దర్భలు మొదలయినవివేసి, దానికే పిండములు పెట్టెదరు. ఆరాతివైభవము పదిదినములే. పిదప నుండదు. మీసముమీఁది మెదుకులమెరపుల్ - ఎట్లు క్షణభంగురములో - కొంచెముకాలము మీసము మీఁద నుండి తరువాత భోజనముచేసినవాఁడు ముఖము కడుగఁగనే జాఱిపోవునట్లే శివునికృపలేని వైభవము లని భావము. ఇందు దృష్టాంతములు రెండు.

౧౯౯. పుట్టనని చచ్చి చానని పుట్టెడు = పుట్టినవి పుట్టినట్టుగనె లెక్కలేకుండఁ జచ్చుచున్నటువంటివి యని యర్థము స్ఫురించుచున్నది. ఈప్రయోగము చింత్యము. పుట్టనని చచ్చి, చానని పుట్టెఁడు - పురుగులు చచ్చునపుడు మరలఁ బుట్ట నని యనుకొనును. పుట్టునప్పుడు చావ నని తలఁచును. అనఁగాఁ బురుగులకు బ్రదికియున్నపుడు తమకెప్పుడు తప్పక చావు గల దన్న జ్ఞానముండదు. చచ్చునపుడు పునర్జన్మ మున్నదను జ్ఞాన ముండదు. ఇట్లువి యేవిధమైన జ్ఞానము లేక మరలమరలఁ బుట్టుచుఁ జచ్చుచు నుండును. అట్లే శివభక్తిలేని మనుజులు మరల మరల జన్మమెత్తుచు ముక్తికి దూరముగ నుందురు.

పుట్టఁగని చచ్చి, చాఁగనీ పుట్టెడు - అనికాని, పుట్టఁగనెచచ్చి, చాఁగనెపుట్టి - అనికాని దిద్దవచ్చును. పుట్టిన కొలఁదికాలముననె చచ్చి చచ్చినకొలఁదికాలముననె పుట్టు నని యర్థము.

౨౦౦. రాజులు రట్టళ్లు = రాజులు రెడ్లు. 'రట్టడి'పదమునకు వాఙ్మయమునందుఁ బ్రచారము లేకపోయినను శాసనములలో నీశబ్దము విశేషముగఁ గానఁబడుచున్నది. రట్టడి, రడ్డి, రెడ్డి యని యీపదముయొక్క రూపవికాస మని తోఁచుచున్నది.

౨౦౨. మంద్రేయేనిక్ = బ్రతుకంచలఁచితిరేని. మనుధాతువు.

౨౦౪. ఆలరి = దుశ్శీలుఁడు.

౨౧౦. కుటిలాత్మకుఁడు ధరియించు గోత్రము నెల్లం = ఇది తాటాకుగ్రంథములోనిపాఠము. కుటిలాత్మకుఁ డుద్ధరించు గోత్రము నెల్లం' అని యుండవలెను.

౨౧౫. అతగుల్ (బలహీనులు). శివుని కవిలియక్ (కవిలెకట్టుకు) ఎక్కుదురయ్య - అని నాల్గవపాదమున కన్వయము.

౨౧౭. మహేశ్వనిర్మాల్యే - "మహేశ్వరనిర్మాల్యే" అని యుండవలయును.

౨౨౪. స్వార్థ పరార్థ శివార్చన - ధనము తీసికొని గుళ్లలోఁ బూజారులు చేయుపూజ పరార్థశివార్చనము.

౨౨౬. దీనికై - అనఁగ ౨౨౪-వ ౨౨౫-వ పద్యములలోఁ జెప్పఁబడిన విషయమును.

౨౨౯. ఒక్కగురువుచే శైవదీక్షఁ బొందినవారందఱును నతని కుమారులవంటివారు; కావున శివపూజాదిశైవకృత్యములందు (కార్యములందు) వారందఱును సోదరులు; ఆగురువునకు నౌరసపుత్త్రుఁడు కలఁడేని యాతఁడు శైవదీక్ష నొందనిచో గురుపుత్త్రుఁ డయినంతమాత్రమున నితరదీక్షితులతో సమానుఁడు కాఁడు. సమానుఁడై శివపూజాదిశైవకార్యములు చేయుటకు నాతఁడు దీక్షపొందవలసియుండును. అని దీనిభావము తోఁచుచున్నది.

౨౩౨. పురుషేచ్ఛను - పురుషుని యిచ్ఛను ననుకూలముగ.

౨౪౩. ఎయిదఁడు - పొందలేఁడు.

౨౬౦. బవరుఁడు - సందర్భమువలన నీపదమునకు దేవుఁడు లేక శివుఁ డని యర్థము స్ఫురించుచున్నది. నన్నెచోడుని కుమారసంభవమునందు నీశబ్దము గానవచ్చుచున్నది.

"క. తొడవులు చివికిన యెమ్ములు। గుడిముట్టు గపాల మిల్లు గుడిముడి యెద్దు। కుడు గట్టుపలువుఁ దోలగు। బవరున కొక్క నవయ నేమిప్రియము వచ్చెన్." (ఆ. ౭. ౭౦.) సందర్భమునుబట్టి చూడఁగా శివతత్త్వసార పద్యమునందువలెనే యిచ్చటను 'బవరుఁడు' అను పదమునకు దేవుఁడు, శివుఁడు నను నర్థము సరిపోవుచున్నది. శ్రీయుత రామకృష్ణకవిగారీపదమునకు "దరిద్రుఁడు" అని యర్థము వ్రాసినారు. అందు కేయాధారమును గనఁబడదు. శివతత్త్వసారమందలి యీ పద్యమందును కుమారసంభవమునందలి పై పద్యమునందును శివుఁడు అను నర్థమున బవరుఁడు శబ్దము సరిపోవుచున్నందున ౧౦-౧౧-వ శతాబ్దములందు, ఈ యర్థమునందే యీపదము వాడఁబడుచుండెనని తోఁచుచున్నది. శాసనములందును భటార పదమొకటి శివుఁడను నర్థమందుఁ గానవచ్చుచున్నది. ఆటవమునందు "పడారక్" అనుపదము పాములవాఁడు, పాములను వశపఱుచుకొనువాఁడు నను నర్థముం గున్నది. అందుండియే యీపదము పుట్టినదేమో.

౨౬౯. ఇందు 'ఆనాఁడు' అనునర్థమునందు 'అన్నాఁడు' అనురూపము వాడఁబడినది. ఈ రూప మిప్పటివ్యవహారభాషయందుఁ గలదు. కాని, గ్రాంథికభాషలోఁ గానరాదు. ఏనాఁడు ఎన్నఁడు ననురూపములు కలవు గాని 'ఆనాఁటి'కి అన్నాఁడు, 'ఈనాఁటికి' ఇన్నాఁడు నను రూపములు కానరావు.

ఈపద్యమున కిట్లన్వయము చేసికొనవలయును. [శివ!] [భక్తుఁడు] నిన్నెఱుఁగుచుఁ దన్నెఱుఁగని యన్నాఁడు శివయోగమగ్నుఁ డనఁబడు; శివా! నిన్నును దన్నును నెఱింగెడి యన్నాఁడు యోగమగ్నుఁ డనఁబడును; లేదా యుత్తరార్థమున "శివయోగమగ్నుఁ డనఁబడఁడు" అని సవరింపవచ్చును.—ఈసందర్భమునఁ బాల్కురికి సోమనాథుని చెన్నమల్లు సీసములలోని యీ క్రిందిపద్యము చూడదగును.

సీ. నీవె కర్త వటన్న నిక్కంబు భక్తుండు, తా నన్న నుభయకర్మానుగతుఁడు
నీకె యన్నను సదానిత్యప్రసాదాంగి, తన కన్న నింద్రియ తత్పరుండు

నిన్ను నెఱింగిన నెట్టన శరణుండు, తన్ను నెఱింగినఁ దాసుండు
నీవు తా నన్నను నిజము లింగైక్యుండు, తాను నీ వన్న నద్వైతవాది
కానఁ గాయకర్మగతిమతిశుద్ధ చై, తన్యభావములను దన్ను మఱచి
లింగగతిఁ జరించు లింగ లింగైక్యులఁ, జేర్పవయ్య నన్నుఁ జెన్నమల్లు.

౨౭౦. అష్టాంగయోగము ప్రసిద్ధమె. షడంగయోగము పాశుపతులకు విశేషము. పాశుపతసూత్రమునం దిట్లు చెప్పఁబడి యున్నది:—'హసిత, గీత, నృత్య, హుడుక్కార, నమస్కార, జప్య, షడంగోపహారేణ ఉపతిష్ఠేతేతి' (సర్వదర్శనసంగ్రహము, నకులీశదర్శనము).

౨౭౧. శివయోగాఘ్య్యల్ - అనిదిద్దవలయును.

౨౮౫. పశుసంతతి - పశుత్వమునకు సంబంధించిన సంతతి; శైవులు కానిసంతానము. శైవగురువులసొత్తు వారిపుత్రులలో శైవు లైనవారికిఁ జెందవలయునే గాని శైవులుకానిరామాళ్లకుఁ జెందఁగూడ దను భావము గానవచ్చుచున్నది.

౨౯౨. పాపటి - అధముఁడు. ఈశబ్దమె శబ్దరత్నాకరమున పాపలి యని యున్నది. అందుకుఁ బ్రమాణము గౌరనరచితనవనాథోపాఖ్యానమునందలి "పాపపు విప్రుని పనికిఁ గామున్న, తాపికాఁ డైనపాపలిమంపడేఁడు" (భా. 3.) అను ద్విపద యీఁబడినది. కాని యిందలి 'లి'కారము ప్రాసస్థానమునందుఁ గాని యతిస్థానమునందుఁగాని లేదు. శివతత్త్వసార మందలి పద్యమున 'టి' కారము ప్రాసస్థానమునం దున్నది. కావున 'పాపటి' యనుపమే సాధు వని యెంచవలయును.

౨౯౩. ముద్దటు లడచిన - పిడుకలు చఱచిన, వెంద్రుకలు వాచికొనిన - చిక్కుదీసికొన్నిన.

౨౯౪. అతకడచిన - అతిక్రమించిన, అగౌరవించిన; ఈయర్థమందె 'అతకరించు' అను ధాతువు కలవు.

౩౧౧. తారాజ్యేష్ఠుని - నక్షత్రములలో శ్రేష్ఠుని.

౩౨౦. నిర్వృతికి - సుఖమునకు.

౩౨౨. సమసుప్తినాథ-కల్పాంతరమం దంతయును బోయెడు నిద్ర సమసుప్తి, దానికధిపతి.

౩౪౧. త్రియాకా - త్రేయుకా అనిదిద్దవలయును.

౩౪౬. జతిలు - దీనిని 'జతులు' అని దిద్దవలయును. జతి, గతి యనునవి నాట్యసంగీతశాస్త్రములలోని పదములు "జతి" యనఁగా నాట్యయోగ్యతగల శబ్దసంతతి. (శబ్దరత్నాకరము) ఇది సంస్కృత యతిశబ్దమునుండి పుట్టినది. 'యతి' యనఁగా వాద్యాంగప్రబంధవిశేషము. 'గతి' యొక గమనవిశేషము.

౩౭౬. నావె - అనవె.

౪౦౨. అతిమెల్పడ - అఱుమేల్పడ ననిదిద్ది మెహమీఁదినుండి పడునట్లుగా నని యర్థము చేసికొనవచ్చును.

౪౧౪. 'దీర్ఘా' యని - దీర్ఘాయు అని. ఇచ్చటి యనుకరణసంబంధమైన యుత్వసంధి చింత్యము. లేదా, 'దీర్ఘా' యనునది పెద్దసంస్కృతవాక్యమందలి మొదటి పదమాత్రముతే యని తలఁపవలయును.

౪౩౭. బెజ్జమహాదేవి - ఈమెనామ మీరూపముతోనే పెక్కు శైవగ్రంథములలోఁ గాన వచ్చును. "మఱియును విను బెజ్జమహాదేవి యనఁగఁ। గఱకంఠశ్రీపాదకమలాంతరంగ" (బస వపురాణము. ఆ. ౩.)

౪౩౧-౩౨. పొసపోర్లై బండారువు బసవన - పొసపోరని బండారువు బసవన - ఈరెండుఁ చోటులను 'పొసపరి యాబండారువు బసవన' యని యుండవలయునేమో. 'పొసపరి' అనఁగాఁ బట్టుపట్టి, ప్రతినచేసి యని సందర్భమును బట్టి యర్థ మిచ్చుచున్నది. బసవపురాణమునందు నీ పదప్రయోగము గలదు. "పొసపరి శూన్యదురోర్బ్యగలఁ దగిలి। భసితం బలందని పాతకులార। [ఆ. ౭.] "బసవయ్య యంత్రము ల్పన్నుటఁ జేసి। పొసపరి మాతోడఁ బోరుచున్నారు [ఆ. ౭.]

ద్వి. దేవరదాసయ్య భావజాంతకుఁడ, దైవంబనుచు జైనతర్కుఁబునూక
పొసపరివట్రీల్లుపాట్లచెర్వునను, వసతులేణ్యూరును ప్రచ్చివైపించె.

పండితారాధ్య. వాదప్ర. పుట ౨౦౦.

౪౩౧ లో "బొసహొర్లై" యని మూలములో నున్నది.

౪౭౧. దీనియర్థము చింత్యము.

---

౩౫. తోఁచుచుండు - తోఁచుచుండ నని సవరింపవలయును.

౪౯. భువనభిన్నభావ - భువిన భిన్నభావ అని సవరింపవచ్చును.

౮౮. హారనికివి - హార నీకివి యనఁదగును.

విఘాతమ్మున కేగుమార్గమునఁ గుముదుఁ డనుశాపోపహతగంధర్వుఁడు చంద్రికారూపాతిశయమును వర్ణించుటయే కాక తాను వసుచరిత్రముం జదివిన వాఁడుం బోలెఁ దనతో రాజును జంద్రికకడకుఁ దోడ్కొనిపోయి నాయికానాయకులకుఁ బరస్పరానురాగము సంఘటించెను. చంద్రభానుఁడు లోకసామాన్యముగ విద్యార్థివేషమునఁ దుంబురుపరిచర్య సేయుచు నొకనాఁడు కార్యవశమున నేతెంచిన నాయికం జూచి మదనపరతంత్రుఁడై తుద కామె పాణి గ్రహించెను. సుచంద్రుఁ డట్లుగాక యకారణబాంధవుం డగు నాముని వాక్యములు వినినంతనె కామపరవశుఁడై యెక్కడనో యున్న నాయికం జూడ వేడుకపడి వానివిమానమ్మున నాయికోద్యానముం జేరి తుదకుఁ దద్దర్శనలాభము ననుభవించెను.

చంద్రికాపరిణయమునందలి నాయికతండ్రి నైషధీయచరితముం జదివిన వాఁడుఁబోలెఁ దనకూఁతుమనంబు సుచంద్రులగ్న మయ్యె నని యెఱింగియు పాటికి స్వయంవరము చాటించెను. స్వయంవరకాలమునఁ జంద్రికకు భూపాలురప్రతాపాటోపాదికమును వర్ణింపఁ బార్వతిని నియోగించెను. పార్వతియు నైషధీయభారతిం బోలె భువనేశ్వరమంత్రమును సుచంద్రున కుపదేశించి యంతర్హితయయ్యె. చంద్రభానుచరిత్రములోని నాయికానాయకులు రుక్మిణీస్వయంవరము నెఱిఁగినవారు గనుక మాయవలన నేమి యేవిధముననైన నేమి సర్వావస్థలను వారినే యనుకరించిరి. రుక్మబాహుండును దనతనయను శిశుపాలుని తనయునకే యొసంగ నిశ్చయించి వియ్యమును రావించి యతనికి ద్వితీయవరాభవమును గూడ సంఘటించెను. చంద్రభానుఁడు కాదంబరీరసాస్వాదనపరవశునట్టులు తనకు సాత్యకితనూభవు నొకని దోడుచేసికొని యడవిలో మృగయావ్యాపారమునఁ జంద్రాపీడుఁడువలెఁ దాను గానవిద్యాభ్యాసమిషంబున స్వజనులఁ బాసి దుర్వాసశ్శాపగ్రస్తుఁడై యాతండు కిన్నరమిథునముం బట్టఁబోయి యేకాకియై గానపరవశయగు మహాశ్వేతం గాంచి తద్ద్వారమునఁ గాదంబరీలాభము నందినయట్టులు వనమయూరంబులం బట్టఁబోయి శాపవశమున నేకాకియై గానాచార్యుం దుంబురుం గని తన్నికటమున విద్యనభ్యసించుచుఁ గుముదినీలాభముం బొందెను. కాదంబరిలోని పుండరీకునట్లు నిందు విజయలోలుఁడు శాపతాపితుఁడై యొకవత్సర మెట్లో చరించి తుద కనురూపకాంతాసమాగమమును బ్రధాననాయకునితో సమముగ నందెను.

ఇట్లీ రెండుగ్రంథములకు భిన్నభిన్నగ్రంథానుకరణములును సాధర్మ్య

వైధర్మ్యంబులును గలవు. కేవలసాధర్మ్యములనే యాలోచించినచో నీయిరువురు కవులలో నొకరి నొకరు తప్పక యనుకరించి రని స్ఫురింపకతీరదు. ఇరువురిలో నెవ్వరు ప్రాచీనులో వారినర్వాచీను లనుకరించి రనుట సమంజసము గదా! మల్లన పూర్వుఁ డనియు మాధవరాయఁ డర్వాచీనుఁ డనియు మా యభిప్రాయము.

ఎలకూచి బాలసరస్వతి తాను రచించిన యాంధ్రశబ్దచింతామణి భాష్యములోఁ దనవంశావతారము నీక్రిందిరీతి నిచ్చియున్నాఁడు:—

౧. తిప్పన, ౨. వల్లభసోమయాజి, ౩. తిప్పన, ౪. భైరవార్యుఁడు, ౫. తిరుమలార్యుఁడు (రామయ), ౬. భైరవుఁడు, ౭. కృష్ణకవి, ౮. బాలసరస్వతి. వీరిలో నైదవపురుషుఁ డగుతిరుమలార్యుఁడు “అళియరామావనీంద్ర దత్తయెడ నిల్లిముఖ్యసద్గ్రామవిభుఁ” డని వర్ణింపఁబడియెను. ఈతిరుమలార్యుఁడు ౧౫౬౪ సంవత్సర ప్రాంతమున నున్నను నతనిమనుమని కొడుకగు బాలసరస్వతి మఱి యిఱువదిసంవత్సరముల పిదప, ననఁగా ౧౬౧౪ ప్రాంతమునందుండి యుండవలయును. ఈబాలసరస్వతిచే మల్లభూపాలీయమును గృతిఁగొన్న పెద్దమల్లభూపాలుఁడు నాకాలమందే యుండునుగదా. చంద్రికాపరిణయకర్త యగు మాధవరాయఁ డీమల్లభూపాలుని కొడు కని కొందఱును మనుమఁ డని కొందఱును జెప్పుదురు. కొడు కనుకొన్న నాతనికాలము క్రీ. ౧౬౪౪ సంవత్సరప్రాంత మగును. కావున నితఁడు తరిగొప్పుల మల్లనకంటె నర్వాచీనుఁడే.

## గ్రంథములపోలికలు.

### చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము.

సీ. నిడుచాలు వెనుచాయ నడకనిద్దపుఁ దేఁటిగమివీరజడలతో గంధవహుఁడుఁ
జెలువంపు మైకప్పుజిగిసురమా వింతవగ జగబిరుదుతో మృగధరుండుఁ
జొక్కంపుఁ దుదిఱెక్క సోఁకుపుప్పొడిరేక పసుపుఁ బావడలతోఁ బక్షికులముఁ
దొగరువన్నియమావిచిగురుమొత్తంబుక్రొంబగలుపంజులతోడ మాధవుండుఁ
బ్రకటగతి వచ్చి యహహామహామికల మాక
మాక యుత్తరు వనుచు సంభ్రమ మొనర్ప
వారిఁ గరుణార్ద్రదృష్టిచే గారవించి
మునివరునిమీఁద నెల విచ్చి పనుపుటయును.

ఉ. చొక్కపుఁబువ్వుఁబొంపములసొంపున మ్రాఁకులు విఱ్ఱవీఁగ నల్
దిక్కులసావితావి నెలదేఁటులపాటల నీటుసూపెఁ బ
ల్పక్కులకాకలీకలకలధ్వని మీఱెఁ జకోరికోరికల్
నెక్కొనఁ బండువెన్నెలలు నిండె యథోచితవృత్తి నయ్యెడన్. 132

కం. కనుఁగవ మోడ్చి నిదిధ్యా
సనతత్పరుఁ డగుచు మస్తచంద్రసుధాసే
చనమునఁ దను దా నెఱుఁగని
మునిఁ గనుఁగొని యేము దాము ముం దని కడఁకన్. 133

సీ. ఉడురాజు నిజనిశితోత్తాలకిరణసంఘము పేరి బలుచిచ్చు గడలఁ జిమ్మి
మధుఁడు శాఖాన్యోన్యమర్శననిసృతజ్వాలకావళిపేరితూలు ఉవ్వి
పవనుండు పేఱెంబువాఱి గంధాయాతభృంగనిధ్యానంబు పేరఁ బిలిచి
శుకపికాదులు గరుత్ప్రకటధ్వనుల పేర వివిధవాద్యంబుల రవళిఁ జూపి
కేశవపదాబ్జచింతారసాశయాంత
రాళగతమానిహృదయశుండాల మవశ
మగుట వెలి దార్పఁగాలేక హత్తి యిట్టు
లమితనిజశక్తిమీఱఁ బోరాడునప్పుడు. 134

చంద్రికాపరిణయము—ద్వితీయాశ్వాసము.

సీ. అరిరాజచిత్తభీకరకరకాండప్రచండిమ మను రాజమండలంబుఁ
గ్రొందళంబులఁ జాలఁ గూర్చుక హరివితానములతో జైత్రసేనావిభుండుఁ
గన్నుల నెఱసుంట గ్రక్కుచుఁ గలరుతుల్ బెరయ నానావనప్రియబలంబుఁ
గనకరజోరేఖ గనుపట్టు వరగంధపటిమ రాజిలు మహాబలకులంబుఁ
దోలుదోలుత దీప్రవిస్ఫూర్తి దొడరి నడువఁ
జిలుకమేల్పక్కిపై నెక్కి యలరువింటి
దంట యమ్మానిఁ గదిసె దుర్దాంతశారి
కాళి యాత్రైకబిరుదపద్యములు చదువ. 76

ఉ. అపుడు రణోత్సుకుం డగుసితాంబుజనాయకుకంటిసన్నఁ గీ
రపటిలి చల్లగాడ్పు తోవశాయఁడు కోయిలపౌజుఁ జైత్రుఁ డ
చ్చపుఁదెలితెక్కపుల్గు లనిసల్పఁగఁ జాలుదు నేన నేన యం
చపరిమితాగ్రహాస్ఫురణ నమ్మునిఁ జుట్టిరి సత్వరంబుగన్. 77

సీ. శైత్యవత్కరకుంతచటులధారారేఖ శమినేత నాటించెఁ జలువమిన్న
తళుకుతళ్కున వేగ జళిపించి మావిక్రొంగళపుఁగత్తిని మాని నఱకెసురభి
కడుఁ జంచరీకసంఘము మ్రోయ ఘనజాలకంబులయతిమొత్తె గడుసుగాడ్పు
కటురజోగ్నికణాళి గ్రమ్మఁ జెంచావమందు తిత్తుల ముని గప్పె హత్తి యంచ
యిట్టు లాదిట్ట లందఱుఁ జట్టు ముట్టి- గట్టితన ముట్టిపడ నురుతాంతికవచ
ధారి జడదారి నొప్పించి ధైర్యలీల, నడపలేకున్కిఁ గని మరుం డపుడు గడఁగి.

చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము 168 పద్యము.

సీ. అరయ ననగ్నికుండాహుతిస్తోమమై బూదిఁగూడె సుమాస్త్రుపోఁడి మెల్లఁ
జగ్గింప నూషరస్థాపితబీజమై ధూళిఁగూడె సమీరుహాళి యెల్లఁ
జింతింప వఱదఁగూర్చిన చింతపండయి నీటఁగూడె హిమాంశు నేర్పు లెల్లఁ
గనుఁగొన నడవిని గాచినవెన్నెలై చెట్లఁగూడె వసంతుచెల్వ మెల్ల
నకట చక్రాతిపై వాన యగుచుఁ జెదరి
పఱచె నలువంకలకుఁ బక్షిబలము లెల్ల
విశ్వభూనాథ విను పదివేలమంది
మన్మథులకైన వానిఁ దెమల్ప వశమె.

చంద్రికాపరిణయము—ద్వితీయాశ్వాసము 114 పద్యము.

సీ. తనక్రొందళములమన్నన చెట్లపాలుగాఁ జనియె సూనశ్రీల నెనసి మధువు
తనతనూగరిమ మెంతయు ధూళిపాలుగా నరిగె వడంకుచు ననదుగాడ్పు
తనమహఃస్ఫూర్తి తోల్తనె యగ్నిపాలుగాఁ బఱచె వెల్వెలఁబాఱి పద్మవైరి
తనపాత్రవృత్తి తోడ్తనె మింటిపాలుగా నడఁగెఁ గొమ్మలఁ బికాద్యభ్రగాళి
తనపురారాతిభీకరోదగ్రవిగ్ర, హస్ఫురణ భూతిపాలుగా నతనుఁ డేగెఁ
జాపశరజాతములు వనస్థలిని వైచి, యమ్మహామౌని కోపాప్తి నడరునపుడు.

చంద్రభానుచరిత్రము—ద్వితీయాశ్వాసము.

సీ. జాఠరశిఖిశిఖాజాతధూమంబులచాడ్పున నల్లనిచాఱ లెసఁగఁ
గ్రోధద్రుమాగ్రసంరూఢపల్లవముల చెలువున నిక్కిన చెవులు దనర
సకలమృగానీకశాసనోద్ధతవేత్రవల్లికచందాన వాల మమర
నాస్యగహ్వరరసనాహీంద్రవిమలతాచ్ఛటలునాఁ గఱకుమీసలు వడంక
నావులించుచు గబ్బున కడరునీఁగ
మూఁకఁ గమియుచు సెలవులు నాకికొనుచు

భూరిభీకరభాంకృతు లొప్పదలఁ గొన్ని
పొదల నడుచక్కి బెబ్బులి గదిసె నొకటి. 39

కం. ఆపులి నిజతురగదిదృ, క్షాపరత న్నిగుడ దాని ఘనపరుషరుషా
చాపలతం దూపు భుజా, చాపలతం దొడిగి శౌరిసంభవుఁ డడిచెన్. 40

చంద్రికాపరిణయము.-ద్వితీయాశ్వాసము.

సీ. అఖిలజంతునిఖాదనాయూథిమైఁ బోలె నతివిస్తృతంబైన యాస్య మమర
నాశేభములఁ జీర్పనట్టి సిబ్బితిఁబోలె నతిగన్ననఖరసంతతి వెలుంగ [నర
స్వమృగహింసావిహారముఁగాంచురతిఁబోలెఁ దలపై నెగయు వాలదండ మొ
నిగుడుకోపాంకురనికరంబగుటఁబోలె సితకేసరములకెంజిగిఁ జిగుర్ప
వక్రదంష్ట్రలు శతకోటివాదుగెలువ
వర్తులపుఁగన్నుఁగవ భానువాసిఁ గేర
ఘుటఘుటార్భటి ఘనకోటిపటిమఁ దెగడ
నొక్కసింగంబు వడిఁ బొదనుండి వెడలె. 27

కం. వెలలి జిష్ణుతురగౌరవ, కలనన్ లంఘించునృపతిఁ గన్గొని నిజని
స్తులచంద్రహాసధారం, దలద్రెవ్వఁగ నేసె నద్భుతంబుగ నంతన్. 28

ఇట్టిపోలిక లనేకములు గలవు గాని గ్రంథవిస్తరభీతి నిట నుదాహరింప లేదు. ఇట్టులీయుభయగ్రంథములకు సాదృశ్యమున్నను వైసదృశ్యము గూడఁ జాలఁ గలదు. మల్లన తఱచుగా వర్ణనములందు మనుచరిత్రము ననుకరించి మృదులమృదులము లగుపదముల నేర్చి కూర్చువాఁడు. మాధవరాయఁ డన్నన్ వసుచరిత్రానుకరణుఁడై శ్లేషాద్యలంకారముల గుప్పించుటకై కొంచెము క్లిష్టపదప్రయోగము గావించువాఁడు. మల్లనకవి యు శ్లేష నతిమాత్రముగ నుపయోగించెను. పదకాఠిన్యమున కంతగా సహించువాఁడు కాఁడు. మాధవరాయలు పదలాలిత్యము నాలోచింపక శ్లేషాద్యలంకారగరిమకే ప్రాధాన్య మిచ్చువాఁడు. మల్లనకుఁ గథాభాగమధికముగా నుండుటయుఁగార్యవశమునఁ గొంచెము కొంచెము గా వర్ణనలఁ బెంచుటయు నభిమతము. మాధవరాయని గ్రంథమందుఁ గథాభాగ మత్యల్పమైనను వర్ణనలచే గ్రంథము పెంచఁబడినది. ఈయిరువురుకవులు నసాధారణపాండిత్యప్రకర్ష గలవారు. శాస్త్రమర్యాదలఁ జక్కఁగ నెఱింగినవా రనుటకు వారిప్రయోగములే ప్రమాణము. ఇతరగ్రంథములందుఁ గానరాని సంస్కృతపదములు వీరిగ్రంథములం దగపడును. మల్లన తఱచుగాఁ గర్ణాటాదీతరదేశ్యపదములను బ్రయోగింపనలవాటుపడినవాఁడు.

మాఘవరాయలట్లొర్చినట్లు కానరాదు. కొం దుత్తమప్రబంధములం గొని తారతమ్యవిచారము చేయుట కష్టము. ప్రస్తుతచంద్రభానుచరిత్రమునకు వత్తము.

### కథావిమర్శనము.

చంద్రభానుచరిత్రమునఁ గథానిర్మాణము విచిత్రముగ నున్నది. ఈకవి క్రొత్తమార్గముం ద్రొక్కినాఁడు. ప్రప్రథమమున రుక్మిణీవైభవామూయచే సత్యభామకుఁ జంద్రభానూదయమును వర్ణించినాఁడు. పిదప నారదాగమనమున సంగీతాభ్యాసమను కథాబీజమును నాటెను. కలహాశనముని కుముదినీలాభమునకు మార్గదర్శకుఁ డయ్యెను. అడవిలో వేఁటాడుచున్న చంద్రభానునకుఁ దుంబురుని చెలికాఁ డొకసిద్ధుఁడు కుముదినీజన్మప్రకారంబును నామెకుఁ దుంబురుఁడు గానవిద్య నేర్పుటయుఁ దెలిపి కుముదిని యందుఁ జంద్రభానుని మనంబొకింత లగ్నమగునటులు వర్ణించి యంతర్హితుండయ్యె. చంద్రభాను చెలికాఁడగువిజయలోలుని తోఁ గూడ వనమార్గమునం బోవుచు నొకచో బడలి నిద్రించుచుండ నొకజింకజంట వారిమెయి నాక నిద్రాభంగవ్యాకులమనస్కులై వారు హరిణపోతమ్ముల బెదరించిరి. ఈపనికై కోపించి దుర్వాసోముని వీరిరువురకు వియోగముగలుగ శపించెను. పిదపఁ గాఱడవి నొకయుద్ధసాధనసన్నద్ధమగురథ మీయదుకుమారులకు గోచర మగుడు నీరధికమగు నాతేరు వా రధిగమించిరి. ఇంతలో నెక్కడనుండియో యకాండ జలదాగమంబుం బోలి యొక్క రక్కసుం డరుదేరఁ జంద్రభానుఁడు ఘోరముగఁ బోరి వాని నుక్కడించెను. ఈయుద్ధవర్ణనము చదువుట కెంతయు మనోహరముగా నున్నయది. కూలిన యాదానవుండు శాపవిముక్తుఁడై కుముదినీలాభప్రధానసాధనం బగు మాయ నాయిరువురుబాలకుల కిచ్చి యథేచ్ఛం జనియె. పిదప శాపవశంబున వియుక్తుండైన విజయలోలుఁడు తిరుపతికిని జంద్రభానుఁడు కుండినమునకు నేగిరి. చంద్రభానుని చరిత్ర మింకఁ బై నంతవిశేషములు కలది గాదు. విజయలోలునికథ ముఖ్యమైనది. విజయలోలుని పాత్రము శేషశైలవర్ణనమునకును గడపట గుముదినీవేషముం దాల్చి ఫలమును సులభము సేయుటకునే కల్పింపఁబడినది. తిరుమలయం దాతనికిఁ గూడ ఫల ప్రాప్త్యాశ యుదయించినది. కాని తుద కాతని ఫలప్రాప్తి ప్రధానము కానందునఁ గవి దాని నంతగా వర్ణింపక చంద్రభానుని వలె విజయలోలుఁ డనువిందుని కూఁతు వివాహమయ్యె నని తేల్చివేసినాఁడు. ఇది కొంతవిరసముగ నగపడుచున్నది కాని యిట్లు తేల్చివేయుట యుచితమే రామాయణమున రామపట్టాభిషేకము నట్లు విభీషణుని లేక సుగ్రీవుని పట్టాభిషేకములు వర్ణింపఁబడియెనా.

ఇందు గ్రంథాదిని నారదవృత్తాంతము వర్ణింపఁబడినది. ఇదియే ప్రబంధ మెల్లఁ గల్పించుట కనువుపడినది. కలహాశనుఁడు రుక్మిణీసత్యాకుమారులకుఁ గయ్యము పెంప నూహించి చంద్రభాను ననాదరించెను. దానిచే నాతఁడు నారదునిపైఁ గినిసి తుంబురునివలన విద్యనేర్చి రా నుద్యుక్తుఁడై యట కేగి గానవిద్యతో పాటు కుముదినింగూడ సంగ్రహించుకొని వచ్చెను. తుదకుఁ దా నభ్యసించివచ్చిన గానవిద్య హరికిని బ్రద్యుమ్నునకును వినిపించి మెప్పునందెను. గానవిద్యయే కుముదినీప్రాప్తిహేతు వగుటచే దానినే బీజస్థానముం దనువు పఱిచెను. విజయులోలుని పాత్ర మంతసార్థకముగ లేదు; మాయాకుముదినీ రూపముం దాల్చి వాస్తవకుముదినిం జంద్రభానునితోఁ బంపుట కుపకరించినది. అసురయుద్ధమున గథచోదనమున కనువుపడినది. కాని శేషశైలవిశేషములఁ దెల్పి తన్నుఁ దా సార్థకపఱిచికొన్నది. వనములో నసురుఁడు యుద్ధమును గుముదినీలాభమునకు సాధన మగుశాంబరీవిద్య నేర్పుటకై కల్పింపఁబడినది, యుద్ధము లేనిచో మహాకావ్యలక్షణానురోధ మని కల్పించిన నుండవచ్చును. విజయులోలునికొఱఁత తీర్చుటకుమాత్రమే యనువిందునికూఁతురు కల్పింపఁబడినది. ఇంకను దరళికాదిపాత్రములు యథోచితకార్యసాధనమునకై యౌచితి నాలోచించి కల్పింపఁబడినవి.

అందందుఁ గొన్ని నెరసు లగపడుచున్నయవి. రసలోలుపుల కవి పాటింపఁదగనివి. ఈయుత్తమగ్రంథ మెల్లర కవశ్యాదరణీయ మని నొడువుటయే శివము.

కట్టి సాంబమూర్తిశాస్త్రి.

శ్రీరస్తు.

# స్వాగతోపన్యాసము (ఏలూరు).

మహాశయులారా!

ఉ. దూరము భారమం చనక తోరపుభక్తిని వచ్చినారు, భా
షారమఁ గొల్చుసత్కవులు సాహితిసాహితి సర్వశాస్త్రవి
స్తారముచేత సద్ఘనులు ధర్మవిధిజ్ఞులు నన్నిటం గడిం
దేరినవారు మాపురికి ధీరులు మీకు నమస్కరించెదన్.

ఉ. స్వాగతమయ్య సత్కవివిశారదులార! బుధాళులార! శా
స్త్రాగమవేద్యులార మఱి సర్వకళాపరిపూర్ణులార సు
స్వాగతమయ్య మేమిడెడిస్వాగతమే పదివేలు మీకు సు
స్వాగతమయ్య లోపముల నంకఁ దలంపకుఁడయ్య వేఁడెదన్.

పండితాగ్రేసరులారా! మహాజనులారా!

అవిచ్ఛిన్నవ్యవసాయము లేక యాంధ్రభాష కారణాంతరములచే నసిచెడి యుండ, నాంధ్రభాషాభిమానియు నాంధ్రమాతసుపుత్త్రుఁడు నగు శ్రీజయంతి రామయ్యపంతులుగారు చెన్నపట్టణమున ప్రెసిడెన్సీ. మేజస్ట్రీటుగా నుండునపుడు వారికిఁ గలపలుకుబడి నంతను వినియోగించి యాంధ్రసాహిత్యపరిష త్తనువిద్యాపీఠమును స్థాపించినారు. దీనికి ముం దాంధ్రకవిపండితసంఘమనునది యొకటి వెలసి మూఁడునాళ్లముచ్చటగాఁ బరిణమించెను. ఈపరిషత్తు నట్టిది గాకుండుటకై వలయునంత మూలధనముతో నాంధ్రదేశమున వెలయు సర్వకవిపండితబృంద సాహాయ్యముతో భాషాభిమానుల నిరంతరప్రోత్సాహముతో జగదలంకారభూతు లగుజమీందారులతో స్థాపించి, నేఁటికిఁ బదివత్సరములనుండి నిర్వ్యాఘాతముగాఁ గొనసాగించుచున్నారు. వారికి మాస్వాగతముతోపాటు నమస్కృతులు.

దూరదేశాగతు లగుమహానుభావులారా!

మీరిప్పుడు చూడవచ్చిన యేలూరుపట్టనము చరిత్రల కెక్కిన ప్రాచీనపట్టనము. భారతపాఠకులకు వేగీవిషయము క్రొత్తదిగాదు. ఈపట్టనమున కనతిదూరమున వేగీపురీచిహ్నము లున్నవి. ఒకప్పు డిది ౮ మైళ్ల మహానగరము.

ఇప్పు డాప్రాంతపట్టనపు రెండుకొనలు పెదవేగి చినవేగి యని రెండుపల్లెగ్రామములుగా నున్నవి. ఆనాఁడు మహోన్నతవైభవమున వేగినా డున్నప్పు డద్దాని పరిపాలకుఁ డాంధ్రభాషానాయకుఁడు రాజరాజనరేంద్రుఁడు. ఈనాఁటి యీ పల్లెలకు దక్షిణవల్లూరు జమీందారు పరిపాలకుఁడు. ఇప్పటికి శ్రీజయంతి రామయ్యగారివంటి దేశచరిత్రశాసనాన్వేషకులు వచ్చి వేగినాడు చూచిపోవుచుందురు. కొలఁది భాషాభిమానము గలనేను ప్రాచీనచరిత్రాభిలాషియు నీజిల్లాకు కలెక్టరు, జడ్జిగా నున్నకోల్‌రిడ్‌జి దొరగారితో వేగిలో నాలుగైదు దినములు గడపినాఁడను. ఱాళ్లను దొరలించి చూచినాము. ధనరాసులు పూడ్చి గుప్తలిపితో గుఱుతులు వేయఁబడిన ఱాతిపలకలకై వెదకులాడినాము. జీర్ణకర్ణాటకరాజ్యరాజధాని యగువిజయనగరమువలెనే వేగియు గొప్పదశ ననుభవించినది. ఆదికవి నన్నయ యీమహోన్నతదశను జవిచూచియుండును. ఇప్పటికిని పెదవేగి యారోగ్యప్రదమైనపల్లెగాఁ దలంపఁబడుచున్నది. అచ్చటి నూతినీరు శనివారప్పేఁట నూజవీడు జమీందారుల కమృతప్రాయము. దూర మనియెంచక ప్రాఁతజమీందారు లానీటినే తెప్పించుకొనుచుండెడివారు.

ఈమాయూరునకు దక్షిణమున నున్న మశీదులో, కొల్లేటిరాజులు రాజ్యమేలునపుడుచేసిన దానశాసన మొకటి మశీదురాయిగా నున్నది. ఆ కొల్లేరుసరస్సు మాయూరికి ౩ మైళ్లదూరమున నున్నను, కొల్లేరుసరస్సు ౧౨ మైళ్లమహాపట్టనమని స్థలజ్ఞులు చెప్పుదురు. అది దిగఁబడిపోయి మహాసరస్సయినదని భూతత్త్వశాస్త్రజ్ఞులు పల్కెదరు. ఇప్పటికి నామహాజలాశయమధ్యమం దున్నచిన్నచిన్నదీవిగడ్డలను జూచిన వానిప్రాచీనత వెల్లడి యగుచున్నది. ఈసరస్సులో నూతులకై త్రవ్వినప్పు డచ్చటచ్చట మనుష్యులు కాఁపురము చేసినట్టులు కానిపించు చిల్లపెంకులు చట్టులు ప్రాఁతపిడతలు దొరకుచున్నవి. కొల్లేటియొడ్డున నున్న పల్లెలుగూడఁ బ్రాచీనతను వెల్లడించుచున్నవి. మొన్న నీమధ్యఁ బెద్దపాడుగ్రామమున రాగిశాసన మొకటి దొరకినది. దానిని మ. రా. రా. శ్రీ. సోమంచి సీతారామయ్యపంతులుగారు మదరాసునకో కాకినాడకో పంపినారు. అందలిలిపి చాళుక్యులనాఁటి యాంధ్రలిపి. ఈపరిషత్తువారికి లభించిన పోతనవిరచిత నారాయణశతకము పెదపాడులోనే లభించినది. ఈ పట్టనమునఁ బ్రస్తుతము తాలూకాకచేరియున్న కోట చళుక్యవంశపురాజులచేఁ గట్టఁబడినది. ఈకోట బొమ్మరింటివంటిది గాదు. దీనికిఁజుట్టు నగడ్త యున్నది. ఇచ్చట, కొల్లేటిరాజులకును గొండరాజులకును గొన్నియుద్ధములు నడచినట్లు

పంబలపాటలు పాడఁబడుచున్నవి. దీనికి సామీప్యమున నున్న దెందులూరు ప్రాచీనపట్టనము. అచ్చటి పాటిదిబ్బ లాప్రాచీనతకు సహజము లగుసాక్ష్యములుగా నున్నవి. ఈయూర నెచ్చటఁ ద్రవ్వినను దేవాలయములు కానవచ్చుచున్నవి. ఒకప్పు డిచ్చట ౧౦౧ దేవాలయము లుండె నని చెప్పుదురు. వానియందలి జాతిప్రతిమల శిల్పమును బరీక్షించి చూచితిని. అవి కొండవీటి రాజుల శిల్పమునకుఁ జాలభేదముగా నున్నవి. కొండవీటిరాజుల గజలక్ష్మి యుండదుఁ గానిపింపదు. ఆకొండ నల్లతాయి గాదు. ఈతా ళ్లెఱుపు రంగు గలవి. ఇందలి శిల్పమునకును గ్రీకుశిల్పమునకుఁ గొన్నిపోలికలు కానిపించుచున్నవి. శిల్పశాస్త్రము గ్రంథప్రాయముగా నున్నదశ వీడి శిల్పుల హస్తగతమైనప్పుడు మలువఁబడిన యాటితేఁటిసశిల్పమువలెఁ గానిపించును. విగ్రహములు జీవకళ యుట్టిపడున ట్లున్నవి. విజ్ఞానకళావిజ్ఞానము మహోన్నతదశయందుండునప్పుడు గాని యిట్టి శిల్పకల్పన కవకాశము లేదు. దెందులూరిలోనియాలయములు శివాలయములు. అందలి లింగాకారము కాశి పాలశిలాలింగాకారమునంటి యాకృతికంటె భిన్నముగా నున్నది. గుడిచుట్టు ఱాళ్లను మలుచునులులు మిక్కిలి నిశితము లైనవి గావలయును. ఆరాతిమలుపు మిక్కిలి సున్నిదముగా నున్నది. ఈఱాళ్లే యీయూరి చెఱువులకుఁ దూములుగా గోరీలకుఁ గవ్వఱాళ్లుగా వాడఁబడియున్నది.

దెందులూరు శైవమతమునకు ముఖ్యస్థానముగా నున్నప్పు డచ్చటి నిత్యసేవకుఁ గాఁబోలు సాను లుండియుండురు. వారి కాప్రాంతమున నే సానిగూడెమని ప్రత్యేక మొకయూరు కట్టఁబడియున్నది. ఈవిధముగా నాకొల్లేరు, వేగినాడు, దెందులూరు మహోన్నతదశయం దుండునప్పు డీపురము, ఏలూ రనఁబడుచుండెను. ఈయూరిచుట్టును ఏఱు గలదు. ఇది తమ్ముఁడేఱు. శ్రీరామలక్ష్మణులు దండకారణ్యమున సంచరించునప్పుడు శ్రీరామునియాజ్ఞను దమ్ముఁడు లక్ష్మణుఁడు కనిపెట్టిన నీటిబుగ్గ. ఇది జీవనది. ఈయూరుచుట్టుకొని యుండుటనిది యేలూరని వ్యవహరింపఁబడుచుండెను. ర, ల, ఌ యభేదతను సాధించుటకు ధ్వనిశాస్త్రమున కిప్పుడు పోఁజాలము. ఏలూ రేలూ రైనది.

ఈవిధముగా నేలూరు ప్రాచీనచరిత్ర చెప్పి మిమ్ము విసిగించినందులకు మన్నింపుఁడు. ఈ యేలూరు హిందూరాజ్యపరిపాలనమును వీడి మొగలాయి రాజుల పరిపాలనమునకు వచ్చెను. ఔరంగజేబు రాజ్యకాలమున నేలూ రనియే దీని వ్యవహారము. ఉత్తరసర్కారుల కిది ముఖ్యపట్టనము. ఇచ్చటఁ దురకల

దండు విరివిగా నుండునట్లు తోఁచుచున్నది. నాఁటినుండి యిచ్చట మహమ్మదీయులు విరివిగా నావాసించుచున్నారు. ఔరంగజేబు రాజ్యకాలమున ఫకీరులకు సన్మానము మెండు. అతఁడు ముసల్మానుమతమున కాచార్యునివంటి వాఁడు. మీరు రైలునుండి వచ్చుదారిలో నతఁ డొకఫకీరున కిచ్చినమాన్యమున్నది. ఇచ్చటికి మిక్కిలి దగ్గఱగా నున్నకొత్తూ రనునది యతఁ డొసంగిన జాగీరు. అది గాక యీయూరిలో దరగాలకు మశీదులకు నతఁ డొసంగిన మడిమాన్యములు నేఁటివఱ కవిచ్ఛిన్నముగా జరుగుచున్నవి. ఈకాలమున మనయాంధ్రభాష పారసీపదములను విరివిగా గ్రహించెను. ఈప్రాంతపుఁ గవులానాఁడు వ్రాసినగ్రంథము లచ్చటచ్చటఁ గానిపించుచున్నవి. ఇది క్రమముగా హైదరాబాదునవాబునకు సంక్రమించి తద్వారమున ఈస్టిండియా కంపెనీ స్వాధీన మై బ్రిటిషురాజ్య మైనది. కంపెనీకాలమున నిచ్చట శిపాయిదండు విరివిగా నుండెను. ఏలూరు రైలుస్టేషను కెదురుగా నున్నమైదాన మాదండు కవాతుచేయు భూమి. క్రమముగా నీయూరు వాణిజ్యవిశేషమున నభివృద్ధిఁ జెంది జిల్లాకు ముఖ్యపట్టణముగ నుండఁదగిన దశకు వచ్చియున్నది. నేఁడు మీరాకచేత నాంధ్రభాషాయోష నాదరించిన కీర్తినిగూడఁ గడించుచున్నది.

మాయూర సంస్కృతవిద్య మిక్కిలికొఱఁతగా నున్నది. ఇంగ్లీషుబడులలోఁ జెప్పఁబడు తెలుఁగువలనఁ దెలుఁగుభాష విస్మృతిచెందుచున్నది. ఆంధ్రభాష క్షీణించుచున్నది. మీవిద్యావీరదర్శనలాభమున మాయూరఁ గూడ నాంధ్రభాషావ్యవసాయము వృద్ధియగునుగాక!

దేవతల నారాధించునప్పుడే గాక విద్యావిలసితులగు మిమ్ము నారాధించునప్పుడుఁగూడ భక్తిహీనమని చెప్పుకున్నను గ్రియాహీన మనిచెప్పి క్షమాపణము వేఁడికొనుచు మాసమాదరాహ్వానము నంగీకరింపఁగోరుచున్నాను.

ఇంకొకమాట—నేను బెజవాడకు వెళ్లి యేలూరున కీసభ నాహ్వానించితిని. నే నీయూరిలోఁ బ్రముఖుఁడను గాను. భాషలోఁ బండితుఁడను గాను. పలుకుబడి గలవాఁడను గాను. ఉత్తమగుణములచేతఁ బ్రజావశీకరణము గావించుకోఁగల నేర్పు గలవాఁడను గాను. సమయోచితముగా నేహంగున కాతాళము వాయింపఁగల యెప్పటికెయ్యది ప్రస్తుత మప్పటి కామాటలాడు వాఁడను గాను. పైపెచ్చు కారణవైరులచే నిరంతర పరిశోధ్యమాన కిణీభూతశరీరుఁడను. ఇట్టి నేను సభ నాహ్వానించినసంగతి శ్రీమోచెర్ల రామచంద్రరావుపంతులవా

రితోఁ జెప్పఁగా "మంచిపని జరిగినది. నీ కేమిభయము లేదు. నే నిది యంతయు నిర్వహించెద"నని సెలవిచ్చినారు. అట్లే శ్రీయుత వేంకటరంగము గారితో మాట్లాడినారు. కాని కైలాసగిరిమీఁదనున్నను శివునకు భైక్షవృత్తి తప్పనట్లు వారంతవారు నా కభయ మొసఁగినను నాకష్టపాటు తప్పినదిగాదు. వారి కింగ్లాండునకుఁ బోవలసినస్థితి వచ్చినది. కాని పోవుచుఁ బోవుచు సభ నాఁపుము, నేనువచ్చి జరిపెద ననిరి. సభ యాఁగలేదు, వారు రాలేదు. అనివార్యకారణసహస్రములచే సభ జరుపవలసివచ్చినది. ఇచ్చటి పరిస్థితులు పూర్వోక్తకారణములచేఁ బలుకుబడిచాలని నాకుఁ దోడుగా వానలు, వానలకంటె హెచ్చుగా సహాయనిరాకరణోద్యమ విజృంభణము, తత్సభలు. పురమందిర మాసభలచే నిరంతరశోష్యమాణమైయుండుట, సభజరుపు మని నిరంతరము తంత్రీవార్తలు తంతులేని మనోద్రేకము.

ఇట్లు తహతహపడి యెట్లో తంటాలుపడి యాహ్వానసంఘ మనునది యొకటి కల్పించితిని. తాలూకాబోర్డు ప్రెసిడెంటు శ్రీయుత పెన్మెచ్చ పెద్దిరాజు గారు, మునిసిపల్ చేర్మేన్ బడేటి వేంకట్రామయ్యనాయుడుగారు, భాషాపరుఁడు వకీలు కాశీభట్ల రామకృష్ణశాస్త్రిగారు, తత్త్వజ్ఞానసంపన్నుఁడు సోమంచి సీతారామయ్యగారు, పూర్వకాలపు నియోగిప్రవరుఁ డనఁదగు వకీలుదుగ్గిరాల రామారావుగారలు నా జడుపుఁదీర్చి నావెంటఁ దిరిగి కావలసినంత సహాయము చేసి సభజరుగుటకు సదుపాయము లొనర్చినారు. మీఁదీయూరినుండి వెడలునప్పు డేమైన మంచిమాట లనెదరా వారినే యనుండు. దైవమెఱుఁగును. నాయంతరాత్మ యెఱుఁగును. అవి వారికే చెల్లవలయును.

నే నిప్పుడు చెప్పిన స్వాగతవచనము లాహ్వానసంఘాధిపతిగాఁ జెప్పినవి కావు. ఏమందురా: నేను జందాలు సమకూర్చుటకు, వచ్చువారి యుత్తరప్రత్యుత్తరములు చూచుటకు, వంటసామగ్రి చేర్చుపనులలోనుండి యాహ్వానసంఘమును బిలిచి యధిపతిని నిర్ణయింపుమని చెప్పితిని కాని సాగలేదు. సాగకపోఁగా నిన్న నొకపెద్దమనుష్యుఁడు వచ్చి "మీరు వచ్చినవారికి సమస్త సపర్యలు చేసి వారితోఁ బల్కాడి కావలసినపని చేయుఁడు సభకుమాత్ర మెవ్వరినైన నధ్యక్ష నేర్పఱిచెద" మనిరి. అంతట నేను నావంటపనిని జూచుకొనుచు నాసందడిలో నుంటిని. తుద కీ యుదయమున సమ్మానసంఘాధిపతిగాఁ గాకపోయిన, నాంధ్రభాషాకవిగా నాంధ్రభాషాప్రచారకుఁడుగా నాంధ్రభాషాపరుఁడుగా నాంధ్రభాషావరుల మిత్త్రుఁడుగా నైన రైలునకుఁ బోయి వచ్చెడి

వారి నాహ్వానించు తలంపున నుండఁగా నొకమిత్రుఁడు వచ్చి "అయ్యో! నిన్న మీటింగు జరుగలేదు. ఏమిగతి. మీరే యాహ్వానసంఘము సెక్రెటరీగా నొకవ్యాసమును వ్రాయుఁ" డని నిర్బంధపెట్టెను. ఆకారణమున సర్వత్రాసర్వత్రా దూరమునుంచి రైలునకుఁ బోక యీయుపన్యాసమును వ్రాసితిని. ఈకారణముచే మీ కాహ్వానసంఘాధిపతినుండి మామూలువాడుకచొప్పున నుపన్యాసము రాలేదు. సెక్రెటరీనుండి వచ్చిన యీయుపన్యాసముతోనే సరిపెట్టుకొనుఁడు. మహాశయు లగుమీ రేదిసహింపఁజాలరు! ఈవృత్తాంతముతో నాయుదంతమును సరిపెట్టి దయనీయుఁడ నగునాయందలి లోపములను గప్పిపెట్టి శ్రీరామచంద్రరావుగా రిచ్చట లేని హేతువున నాకుఁ గలిగిన కష్టపాటును గనిపెట్టి యాహ్వానసంఘము కూడుటకే వీలుగాని సందర్భమును గనిపెట్టి యితోధికభక్తితో నాహ్వానసంఘముతరఫున నే నొనరుచు సేవను మాత్రమే తలంచి నన్ను మన్నింపఁగోరుచున్నాను.

నందిరాజు చలపతిరావు.

---

శ్రీరామసహాయః.

సీ. ప్రతివత్సరంబు, దూరం బని మానక తత్తత్పురముల కుదాత్తమోద [గిన
హృదయులై యేగుచు హృదయంగమాంధ్రభారతి నాఁడునాఁటికిఁ బ్రబలఁద
నెరవులుగాంచి నవీననిఘంటువు తోడ్తోడఁ దుదిముట్టుత్రోవ లరసి
పరిషత్ప్రియులు జయావహాముగనెఱపుచు సహృదయహృదయరంజకముగాఁగ

గీ. శబ్దశాస్త్రాదులను విమర్శనము సల్పి
వ్యాసముల్ వ్రాసి ప్రకటించుపండితులకుఁ
గావ్యనాటకము లొనర్చుకవులకు నిదె
స్వాగతపురస్సరయానమస్కారశతము

సీ. సరసులు గొనియాడ శతవధానముఁ జల్పి మంచిపేరు గడించిమనెడుప్రోడ
తనదు శిష్యుల నవధానులఁగా దిద్ది పొగడిత కెక్కిన బుద్ధిశాలి

నలుగురువినిమెచ్చనాటకంబులుఁ గావ్యములుఁ బెక్కురచియించి వెలయుసుకవి
బళిబళీయంచు సభ్యులు మాటిమాటికి నెంచుమాడ్కి నుపన్యసించుదిట్ట

గీ. చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి చెలువుమీఱ
నాంధ్రసాహిత్యపరిషదగ్రాసనాధి
పత్యము వహించె నమ్మహాప్రాజ్ఞున కిదె
స్వాగతపురస్సరీయానమస్కారశతము

సీ. పాపభంగపటిష్ఠభంగమారుతముచే మిగులందనర్చును గౌతమీస్రవంతి
శ్రీరంగనాయకుకృపకుఁ బాత్రముఁ జేసి కూర్మిఁ గన్నులవిందుఁగూర్చెఁ బెన్న
రంగదుత్తుంగతరంగడోలల నూఁపె నిరుడు కృష్ణాతటినీమతల్లి
బల్లారిముఖగణ్యపత్తనరాజముల్ సత్కారములొనర్చె స్వాంతమలర

గీ. నాంధ్రసాహిత్యపరిషదబ్జాయతాక్షి
నేఁడు హేలాపురంబు నీజాడఁ దెలిసి
హర్షమెసఁగ సంభావించు నర్థభంగిఁ
గనుక నిచ్చోటనటువలెఁ దనియ నెంతు.

కలువపలపల్లి రంగనాథశాస్త్రి

# గ్రంథస్వీకారము.

---

## ౧. చెన్నపురీవిలాసము.

ఇది శ్రీనల్లూరుప్రభువు లగు శ్రీమద్రాజాబహదరు బొమ్మదేవర నాగన్న నాయనివారి యాస్థానవిద్వాంసుఁడగు మతుకుమల్లి నృసింహకవీంద్ర ప్రణీతమైన పద్యకావ్యము. శ్రీరాజాగారితోఁ గవిగారు చెన్నపట్టనమునకు విచ్చేసినపుడు రాజానుమతిని జెన్నపురిని వర్ణించియున్నారు. ఈగ్రంథముం జదివినఁ జెన్నపురివీథులు పేటలు మొదలగు సమస్తవిషయముం దెలియును. ఈరాజాగా రఱువదియేండ్లక్రిందటి [illegible] గ్రి సం॥ మాఘమాసములోఁ జెన్నపురి, యొకనిమిత్తంబున విడిన తమ గూడూరుపరగణా యనుజీర్ణరాజ్యమును మరల నార్జింపఁదలఁచి వచ్చినట్లును ప్రభువులయభిమానముచే నార్జించి యానందించుచుఁ దమకవీంద్రునిచే వినోదముగా నీపురీవర్ణనము చేయించినట్లును గలదు. కవి మిక్కిలి ప్రతిభాశాలి.

మ. "ననుమాల్యాద్రినృసింహధక్త్యుదిత నానాశాస్త్రపాండిత్యశా
లిని శ్రీమత్కనకాద్రిశాస్త్రిసుతు ధీలేఖర్షభాచార్యు"

అని కవి తన్నుఁగూర్చి చెప్పికొనియున్నాఁడు.

"చతుష్షష్టి విద్యావిదులు భవత్ప్రపితామహుఁడు మాధవకవి" యని "నవభారతాది నానాగ్రంథకర్త నీతాత నృసింహావిద్వద్వరుం" డని "శబ్దశాస్త్రత్రయీవిచక్షణుఁడు నీజనకుఁ" డని నాగభూపాలుఁడు పొగడినట్లుకూడఁ గలదు.

ఈగ్రంథ మాఱువద్ధతులుగా విభాగింపఁబడినది. స్వరూపపద్ధతి, పూర్వపద్ధతి, దక్షిణపద్ధతి, పశ్చిమపద్ధతి, ఉత్తరపద్ధతి, అంతరాళపద్ధతియు నని.

కొన్నిపద్యములు:—

మ. చతురశ్వద్విహయాన్వితంబులు చతుశ్చక్రాభిరామంబులం
చితచిత్రాంబర సద్వితానకములై చెన్నారుసారట్లను
న్నతిమీఱన్విహరింతు రప్పురిని నానాదేశభూపాలసం
హతితత్పూర్విభవేక్షణాభ్యుపగతాశాధీశులంబోల్పఁగన్.

గీ. ఇట్టిపోతులఁబోల్కంచి యెడ్లబండ్లు
పటురయంబునఁ బఱచు నప్పట్టణమున .... ....

చ. లలినలయేడుబావులజలంబు లిలాంతరలీననాళికా
వలి మిళితంబులైనడచి వారిధితీరమునందు నొక్కయు

జ్జ్వలజలయంత్రకుండి నిలువన్బహుమారయియానుతౌసరం
గులుగొని యోషలందు జలకుండములునింతురు నిచ్చనిచ్చలున్.

శా. ఛాయాగ్రాహిణి యాంజనేయునితను చ్ఛాయన్వడిన్నిల్పి తా
డాయందీసె ననంగవింటి మది చూడన్యంత్ర పేటిన్ ఘన
ప్రాయావర్ణములందు నీడలఁ బొటోగ్రాఫీక్రియన్నిల్పఁగా
జేయంజాలిరి యింగిలీషులు పురిం జిత్రాతిచిత్రంబుగన్.

గీ. ద్రావకన్య స్వతంత్రులఁ గ్రమముతోడ
జరగు నాకృష్టిశక్తి యుత్సరశక్తి
యొకటిఁబట్టిన రభసమించుకయు లేదు
నుభయము గ్రహింపఁ బరఁగు సత్యోల్బణంబు.

ఈ గ్రంథమును శ్రీలక్ష్మీనృసింహత్రిశతీస్తోత్రమును పుంస్త్రీనిర్ణయచంద్రికా పుంస్త్రసూర్యోదయకాలమహాప్రళయ దర్శనము ననుసంస్కృతగ్రంథములును గవిగారిపుత్త్రులు బ్రహ్మశ్రీ మఱుకుమల్లి రఘురామసురాయశాస్త్రిగారొసంగిరి. వలయువారు తెనాలిలో నున్నవీరి పేర వ్రాయవలయును. వెల, ౦-౮-౦.

౨. విగ్రహాభరణము.

కాకినాడలోఁ బ్రహ్మశ్రీ గోవిందరాజు హరిశ్చంద్రరావుగారిచే రచియింపఁబడిన ౧౩౬ పుటల చిన్న వచనపుస్తకము. ఈశ్వరుల నేకులని విగ్రహారాధనము కూడదని చేయు మనవారి కుతర్కములకు శ్రుతిస్మృతి పురాణేతిహాసములనుండి యుదాహరణములతోఁ బెక్కు దృష్టాంతములతోఁ జెప్పఁబడిన ప్రత్యుత్తరరూపమైనది. ఈశ్వరైక్యము, యాథాత్మ్యము, సఫలభ్రమ, తాదాత్మ్యభావన, ద్వివిధబ్రహ్మము, ప్రతిబింబప్రాచుర్యము మొదలగు ౨౩ విషయములిందుఁ జర్చింపఁబడినవి. అందుఁ గొన్ని వాక్యములు:—

"ఈశ్వరప్రతినిధి నారాధించుటవలన నీశ్వరునకుఁ బ్రీతికలుగును. రాజప్రతినిధిని గౌరవించుట రాజును గౌరవించుట యగును. అట్టి ప్రతినిధి చేతనుండు మాత్రమే యైయుండవలయు నను నియమము లేదు. భరతుఁడు శ్రీరాముని పాదుకలను పీఠముననిడి రామునియట్లు పూజించెను. రాముఁడు భరతుని భక్తికి సంతోషింపలేదా. కావున విగ్రహము చైతన్యము లేనిదైనను నారాధనకు యోగ్యమగుచున్నది. మఱియు మహేశ్వరుఁడు స్థాణుశబ్దవాచ్యుఁడగుటవలనఁ జలనము లేని ప్రతిమ యాతనికిఁ బ్రతినిధిగా నుండుట కర్హమగుచున్నది. అతఁడు నిశ్చలుఁడు. ప్రతిమయు నట్టిదే. అనురూప్యము లేదనుట తప్పు"—
దీని కాక్షేపము సమాధానమును గలవు

దీని వెల ౦-౮-౦. గ్రంథకర్తగారియొద్దనే దొరకును.

—